శ్రీ

శ్రీగురుభ్యోనమః.




# శ్రీరామనామ, శివతారావళీస్తోత్రం



ఇది

నెల్లూరిజిల్లా, దరిశతాలూకా, తాళ్ళూరిగ్రామ

కరణము, తాళ్ళూరి సుబ్బరాజు కవిచే

రచియింపఁబడి



అమలాపురంతాలూకా, బెండమూర్లంక నివాసులగు

శ్రీవేదమూర్తులయిన కోటమర్తి యజ్ఞనర్సుశాస్త్రి

గారిచే సంచూడఁబడి

—:():—

అమలాపురం

పేరి వెంకటేశముగారి

స్వకీయ శ్రీశార్వరీముద్రాక్షరశాలయందు

ముద్రింపించి ప్రకటింపఁబడియె.

మొదటికూర్పు.—1000.

1912



# శివనామం.

——::O::——

1 శ్రీకరభక్తిని శివశివయనగను- సిరులొసగును ధర శివనామం।
ప్రకటముగ నీప్రపంచమయమై- పరమొసంగునది శివనామం॥

2 మక్కువతో స్మరియించువారలకు- మహిమ్మునిచ్చునది శివనామం।
ముక్కంట్యూరబడి మోములవేల్పనె- పెక్కుపేర్లుగల శివనామం॥

3 మిత్తిదొంగయని లోకములందు- వపత్తిజెందినది శివనామం।
భక్తులపాలిట సౌభాగ్యంబని- ప్రణుతిజెందినది శివనామం॥

4 గట్టువిల్తుడై మువురిదానవుల- సట్టణంచినది శివనామం।
చట్టునవీరావేశమ్ముననొక- పట్టినిగన్నది శివనామం॥

కరకంఠుండై యురగహారముల- నురమునదాల్చిన శివనామం।
నరకేసరియగు హరితోఘోరను- శరభంబైనది శివనామం॥

6 మిక్కిలికన్నన చక్కనిమన్మథు- నుక్కణంచినది శివనామం।
పక్కబాయకను పార్వతియును- దానొక్కటియైనది శివనామం॥

7 బేశికంటివాడనగలోకముల- వాసికెక్కినది శివనామం।
వాసవాదినుతుడగుచు జగములను- భాసిలుచున్నది శివనామం॥

8 మిన్నువాకనేకన్నెనునతిగా- చెన్నుగనేలిన శివనామం।
అన్నిలోకములు పన్నుగనేలుచు- సన్నుతికెక్కెను శివనామం॥

9 బుడుతనెలను తనపెడతలయందున- తడయకదాల్చిన శివనామం।
జడతనంబునను తిరుగుమానవుల- కడితేర్చునదగు శివనామం॥

10 ప్రియంబుగనునుతిశేయగ- మోదప్రియంబులొందును శివనామం।
త్రియంబకుండను పేరునలోక- త్రయంబునిండిన శివనామం।

11 ఆకారములేకుండగ లింగ- మయాకారంబగు శివనామం ।
భీకరమగుయమకింకరులకు- పిడిబాక్కైయుండును శివనామం ॥

12 యెన్నిజన్మములు జేసినపాపము- లన్నియుబాపును శివనామం ।
మన్ననవిడి సాదక్రింబున- దక్షునిజన్నముజెరచిన శివనామం ॥

13 పాపారణ్యకుఠారంబనుచును- శ్రీపతిగొలిచెను శివనామం ।
బాపురేయనివేడిన భక్తులకును- భవములడంచును శివనామం ॥

14 సురగరుడోరగసిద్ధసాధ్యులును- గురిగదలంచిన శివనామం ।
నరునకు పాశుపతాస్త్రంబొసగియు- సురనుతమైనది శివనామం ॥

15 గరళకంఠహరపరమేశ్వరయని- స్మరణసేయదగు శివనామం ।
ఉరగశయనుడగుహరి తనమనమున- మరిమరివేడెను శివపామం ॥

16 ఉమానసముఖమున శివనాపగను- నృత్యమునుసల్పునది శివనామం ।
రమారమణుడగు కామజనకుడతి- ప్రమోదమందిన శివనామం ॥

17 కాలునిదూతలపాలిట- కడుభీకరమైయుండును శివనామం ।
వాలాయంబుగను మూడులోకములు- పాలనజేసెడి శివనామం ॥

18 అందినమామిడిఫలమై- పరమానందంబైనది శివనామం ।
డెందమునొందెడు భవరోగంబులకు- మందైయుండును శివనామం ॥

19 చండీశుడు మొదలైన ప్రమథులు- నిండుకొల్వుగల శివనామం ।
దండధరునివిడదోలి బాలుమార్కండునినేలిన శివనామం ॥

20 శంకరశత్రుభయంకర- భక్తవశంకరుడనదగు శివనామం ।
యింకనీవెదికోరినిన భక్తజన- శంకలుడుప్పును శివనామం ॥

21 హాలాహలమును తనకంఠంబున- నణచిపట్టినది శివనామం ।
కోలాహలముగ భక్తులకోరికలు- కొనసాగించెను శివనామం ॥

22 కాంచాదిగకైలాసమునందును- కదలక వెలసిన శివనామం ।
బాణాసురువాకిలియందున- తాభటుడైనిలచిన శివనామం ॥

23 పంచాక్షరీయ సెనంత్రిముచ్చేత- ప్రపంచమునిండిన శివనామం।
అంచితంబుగ నాగ్గురవొంగల- పొంచిపట్టగల శివనామం॥
24 కోరికయనియెడి నాకినాహముకు- మారుతమనదగు శివనామం।
పారెపారెకునుపానంమడుమారి- కోరిభజించిన శివనామం॥
25 క్రోధమునెడు హ్రిమముగలంచను- మదవారణమనదగు శివనామం।
సాధుజనులహృదయమ్మునసెప్పుడు- పాముగనిలుచును శివనామం॥
26 కరిసమలోభగుణంబడంచుటకు- హరియనదగునీ శివనామం।
హరహరకావుమటంచువేడినను- సరేసరేయను శివనామం॥
27 అంధకాసమమోహానుడంచుట- కర్కబింబమగు శివనామం।
సంమగొంచులంజెంమను చూచిన- సందేతానౌ శివనామం॥
28 ఖిలలోమదకును కుధరముపాలిట- కులిశంబనదగు శివనామం।
సలలితముగ మాత్సర్యమునణచను- సులభంబైనది శివనామం॥
29 శాంసహారమున బంగెడి- శ్రీశివతారావళియను శివనామం।
ధాంయుణి తాళ్ఫ్యారి సుబ్బారాట్ల విని- ధన్యునిజేసిన శివనామం॥

శ్రీ శివతారావళీస్తోత్రము సంపూర్ణం

శివార్పణమస్తు.

శుభమస్తు

# శ్రీరామనామస్తోత్రం

-::0::-

1 శ్రీరామాయనుదలచినవారికి- మేరువుహీధరమీనామం ।
ఘోరనరకమనె వారివాహముకు- మారుతమునదగు నీనామం ॥

2 కరిప్రహ్లాదవిభీషణాదులను- సరగునబ్రోచినదీనామం ।
కరువలితనయుడు మరువక నెప్పుడు- స్మరణసేయునది యీనామం ॥

3 మత్స్యరూపమై ముచ్చుసోమకుని- మహినిద్రుంచినది యీనామం ।
స్వచ్ఛమైన కమఠావతారమై- స్వేచ్ఛగ వెలసినదీనామం ॥

4 హేమాక్షునికిటిరూపంబై- ధరనామమణంచినదీనామం ।
హేమకశ్యపునినారసింహమై- యీమహిగూల్చినదీనామం ॥

5 బలియనుదానవభర్తనుబట్టియు- బంధనజేసినదీనామం ।
బలిమినిభార్గవరాముడయ్యు- నిరపతులద్రుంచినది యీనామం ॥

6 రావణాదిరాక్షసులరణంబున- రయమునద్రుంచినదీనామం ।
ఆవిభీషణుని లంకాపురమున- కధిపునిజేసినదీనామం ॥

7 యదుకులంబునను బలరాముండై- యెదురుగ వెలసినదీనామం ।
మధురాపురిగల సదనంబులలో- ముదమునొందినది యీనామం ॥

8 దానవసతిమానంబుహరించిన- దైత్యమర్దనంబీనామం ।
మానుగ కల్క్యవతారంబై- యసమానతనొందినదీనామం ॥

9 అమరులమొరవిని యయోధ్యపురిలో- నవతరించినది యీనామం ।
క్రమముగ లక్ష్మణభరతశత్రుఘ్నుల- సమముగనేలినదీనామం ॥

10 దురమున తాటకియనురాక్షసిని- తున్మివైచినది యీనామం ।
పురరిపువిల్లునుమాడి- ధరణీజను పరిణయమొందినదీనామం ॥

11 వాలిని నొకకోలను ధరగూల్చిన- చాలబలిమిగలదీనామం ।
మేలుగ వాయుజసుగ్రీవులతో- లాలన జేసినదీనామం ॥

12 తండ్రిబంచినను విపినంబులకును- తర్లిపోయినది యీనామం ।
ఖండబాణమున దండిరక్కసుల- ఖండన జేసినది యీనామం ॥

13 వానకాలమేగినతదుపరి- కపిబలమునుగూర్చినదీనామం ।
ఆనకట్టగానంబుధిగట్టియు- నావల జేరినదీనామం ॥

14 యింకనీవెదిక్కనిన విభీషణు- శంకయుదీర్చినదీనామం ।
లంకపైకి వానరబలమును- నిశ్శంకముదోలినదీనామం ॥

15 రావణరావణి [redacted] రాక్షసరాజుల- రణమునద్రుంచినదీనామం।
ఆవిభీషణునకును లంకాపురి- తీవిగనిచ్చినదీనామం ॥

16 జనకజదోటక్కని సాకేతమునకు- జనుదెంచినదీనామం ।
జనపతియై భువి జనములనందరి- చెన్నుగబ్రోచినదీనామం ॥

17 దేవకివసుదేవులకుపుత్రుడై- తేజరిల్లినది యీనామం ।
యీవసుధాస్థలియసమానంబై యింపుజెందునెపుడీనామం ॥

18 నందుడుమొదలగు యదుబృందము- లానందమొందినది యీనామం।
మందలోగల పాల్ పెరుగుత్రావి- బల్ నందడిచేసినదీనామం ॥

19 పూతనాది రాక్షసతతులనెడి- యరాతులద్రుంచినదీనామం ।
ఖ్యాతిమీరగా గోవర్ధనమొక- చేతనెత్తినది యీనామం ॥

20 కంసచ్ఛేదన కౌరవనాశన- కారణభూతంబీనామం ।
హింసజెందకను కుంతీతనయుల- నిలలోనేలినదీనామం ॥

21 అబ్బబ్బా శ్రీరామనామం- బతిమాధుర్యంబీనామం ।
గొబ్బున తాళ్ళూరి సుబ్బరాట్కవికి- కోరికలొసగినదీనామం ॥

శ్రీరామనామస్తోత్రం సంపూర్ణం.

శ్రీరామార్పణమస్తు.